శ్రీ

# వేంకటేశ్వరశతకము

పబ్లిషరు

టి వెంకాజిరావు,

తాడిపత్రి.

1932



మొదటి కూర్పు 500

ప్రింటర్సు

రావ్సు ప్రింటింగ్ ప్రెస్, తాడిపత్రి.

వెల 0—1—0

శ్రీమదలిమేలుమంగానాయకస్తోత్ర

శ్రీవేంకటేశ్వర పరమాత్మనే నమః

# వేంకటేశ్వరశతకము.

ఉ॥ శ్రీరమణీమనోహర, ప్రసిద్ధపురాణవిరాట్స్వరూప, కం ।
సారి, మురారి, శౌరి, విబుధారిచయారి, హరీ, సునిర్మలా ।
కార, మహాధికార, జనకా, మునిమానసచార, వేదసం ।
చార, కృపావిశాల, నినుసన్నుతిజేసెద వేంకటేశ్వరా ॥ ౧

చ॥ అరయగ పేరులేమ, ధరయందెటుజూచినగానరావు, ని ।
న్నెరుగగ నేరికిందెలియు, నెక్కడనుందువొ యేమిచేసితో ।
బరగెదవో మహాత్మ జనపాపవిదారణ, లేవో ఉంటివో ।
యెరుగను మందబుద్ధిని మహేశ్వర బ్రోవవె వేంకటేశ్వరా ॥ ౨

। ఆలయమందునున్న శిలయందును నీవు వసించి లోకముల్ ।
పాలనజేసెదంచు ధర భక్తులు పల్కగ వింటు, దేవ, నీ ।
కేల రహస్యవర్తనము? ఎందు జరించిన నడ్డగింతురే ।
చాలును మ్రోలనిల్చి మము జక్కగ బ్రోవుము వేంకటేశ్వరా ॥ 3

చ॥ ఇలగలజంతుజాలముల నెల్ల సృజించను బెంపజంపనీ ।
వలననెగల్గునంచు ధర బండితులెయ్యెడ బల్కుచుంద్రు, నీ ।
కలనట లేదె? నాదు హృదయమ్మున నిశ్చలచిత్తవృత్తితో ।
నిలచి సుఖమ్ము నిమ్ము, మునిసన్నుత, శాశ్వత వేంకటేశ్వరా ॥ ౪

ఉ॥ ఈతనువస్థిరంబనియు, నీధరకుందగు రూపురేఖలుం ।
జేతులుకాళ్లులక్షువులు, స్నిగ్ధశరీరముమానియుంటితో ।
గౌతమకశ్యపాది ముని గణ్యులకేగతిగోచరించితో ।
శ్రీతరుణీమణీశ్వర! వసింప వెనాకడ వేంకటేశ్వరా ॥ ౫

ఉ॥ ఉల్లసలీలలోకముల నూఱకనీవు సృజించి పెంచుచుం ।
మెల్లగనంత్యకాలమున మేటి రయానననశింపజేయునీ ।
పల్లదసంబదేల? ఇటుబాలునికైవడినాడనేలకో ।
చల్లనిసామి! పుట్టటయు జచ్చుటమాన్పుము వేంకటేశ్వరా ॥ ౬

ఉ॥ ఊఱకయుండ దోచదె? అహెహా, యిటుకోట్లసృజింపనేల ? నీ।
కేరువిధించిరీపని? మహిం సృజియించిన ప్రాణికోట్లకిం ।
పారగ సర్వసౌఖ్యములనంతముగానొసంగకున్ననీ ।
గౌరవమెందునిల్చు,జనకా? పరమేశ్వర వేంకటేశ్వరా ॥ ౭

ఉ॥ ఎక్కడచూడనీవెయని యేమియొచెప్పుచునంద్రుదేవ, నీ ।
వెక్కడనుండువాడవో మహేశ్వరదాగుడుమూతలేటికిం ।
నిక్కపుసామినిన్నుగననేరను కట్టెదుటం వసించిమా ।
యిక్కటులెల్లబాపగదె ఈశ్వర శ్రీవర, వేంకటేశ్వరా ॥ ౮

ఉ॥ ఏవిధినిన్నుగొల్వనగు ఏవిధినిన్నుగనంగనౌనో, ఇం ।
కేవిధిమాకుదిక్కగునో, ఏవిధినీకృపమాకు గల్గునో ।
పావనమూర్తిమందుడను, పాపములెంచకతోడనిల్చి నం ।
గావవె నిర్వికార, జనకా, సుదయాపర, వేంకటేశ్వరా ॥ ౯

ఉ॥ ఐననుగట్టివాడవు మహామతివీవు, నిరంతరంబునీ ।
పైననెచిత్తముంచి నిను భక్తినినెన్నుచు నీశరణ్యమే ।
మానక యెప్డుగోరెడు సమాయకులన్ మదిదల్పబోవు, ఎం ।
తేనియు మామొరన్ వినవు, ఏమనియందును వేంకటేశ్వరా ।

చ॥ ఒకతరిదంతియొక్కఁడు మదోద్ధతిచే జలక్రీడనుండగా ।
మకరికిజిక్కి పోరుచు గ్రమంబుగనాశలు వీడిదక్కఁగా ।
సకపరమేశ్వరా సుకరుణామయ రావెయటంచు వేడనీ ।
వకరముజాపి బ్రోచితివి! భక్తపరా హరి వేంకటేశ్వరా।౧౧

ఉ॥ ఓకరుణార్ద్రమూర్తి నను యోషితనిట్లు వివస్త్రజేయగా ।
నీకురుపుత్రకుల్ గడగి రీగతిమాన్పి సుఖంబునీవె, రా ।
వేకరుణింపవే యనుచు వేడినమానినికీవు సత్కృపన్ ।
కోకలనిచ్చిబ్రోచితివి కూరిమినెన్నద వేంకటేశ్వరా॥ ౧౨

ఉ॥ ఔదలగంగదాల్చిన మహాత్ముడు, నాల్గుమొగాలసుండి స ।
ద్వేదములెల్లబల్కిన మహాత్ముడు, నింద్రుడు,సర్వదిక్పతుల్ ।
నీదయ యెప్డుకోరుచును నిన్నుభజించుచునుంద్రుగాపెనా ।
పైదయజూపదోచునె, కృపాకర శ్రీవర వేంకటేశ్వరా ॥ ౧౩

ఉ॥ అంబుజగర్భ, వాసవ, హిమాద్రితనూభవ ప్రాణనాథ, క్షీ ।
రాంబుధిసంభవా, ర్యమ, గజాస్యకుబేర, ధనంజయాదిబృం ।
దంబులకీవుగన్పడవు నాకెటుదర్శనభాగ్యమబ్బు? పా ।
పంబుల తుప్పునీశ్వరకృపంగని బ్రోవవె వేంకటేశ్వరా। ౧౪

చ॥ కనులకుగానరావు! జనకాయనిపిల్చిన బల్కబోవు! నీ |
దనియొక పేరులేదు! వినయమ్ముగ ప్రార్థనచేయవిందువో |
వినజెవులున్నవో యెరుగ వేడుక నాడవు లేవొ ఉంటివో |
కనను ననెట్లు బ్రోచెదవొ కల్మషనాశక వేంకటేశ్వరా॥ ౧౫

చ॥ ఘనిజము, వృక్ష సంపద, నగాధ మహార్ణవ, మద్రి, పర్వస |
స్యవిలయముం ధనంజయుని, నంబువు, వాయువు, దేజజాలముల్ |
మునుసృజియించి యోగ్యముగ బుద్ధిబలంబున గూర్చి ప్రాణికో |
ట్లనుసృజియించితీవు మొదలన్ గృపయెట్టిదొ వేంకటేశ్వరా॥ ౧౬

చ॥ గజపతిగాచినావట! జగత్పరిసంధిని ద్రుంచితత్సుతున్ |
సుజనుని బ్రోచినావట, వసుంధర గ్రాపదినిన్ను వేడిన |
కృజముగ మానరక్షణ సుఖంబును నిచ్చితివంట, ఓశ్రీలో |
క జనక! నీకృపాబలమగణ్యము నిత్యము వేంకటేశ్వరా॥ ౧౭

చ॥ ఖగపతివాహనా! ప్రణతకల్మషదారణ! దుష్టభంజనా! |
జగదరినాశనా! సకలసాధుజనావన! దేవ! నిన్ను నె |
న్నగనిల నేరికింగలుగు, నాకిలగల్గు నెయట్టిభాగ్యమో |
యగణితసత్ప్రభావ, పరమాత్మ, మహేశ్వర వేంకటేశ్వరా॥ ౧౮

చ॥ చలనము లేనిరాళ్ళులును, చంచలమైన సజీవకోటి, ని |
ర్మలమగు పంచభూతతతి, రమ్యహిమాంశుడు, చండభానుడున్ |
నిలచుట నీమహాత్మ్యమె! గణింపగ శక్యమె నీదు శక్తి, నిన్ |
దెలియగ లేము, బ్రోవగదె, దీనులమమ్మల వేంకటేశ్వరా॥ ౧౯

ఉ॥ ఛత్రము నీకు నాకము వసుంధర నీదు పాదముల్ |
చిత్రము నీమహాంగము ప్రసిద్ధము సర్వమయంబు దేవ నీ |
నేత్రములర్కచంద్రములు నీముఖమే యగ్ని శ్వాసవాయువుల్ |
పత్రిశయాన నిన్నుగన బాపుల కెట్లగు వేంకటేశ్వరా ॥ ౨౦

చ॥ జనక! త్వదాంఘ్రిపద్మముల సంస్మరణంబున సర్వపాపముల్ |
చనును నినీకథల్ ధరను జాటుచునున్న విగానభక్తిమై |
మనమున నామకీర్తనము మానక సల్పెద నీదుదర్శనం |
బును దయచేయవే దప్రభూ భువనావన వేంకటేశ్వరా ॥ ౨౧

చ॥ ఝషవపువు నాల్గు వేదముల సోమకు చెంగటి నుండి గాచితో |
విషఘనద్రోక్కి లోకుల నభీతమనస్కులుగాగ జేసితో |
వృషభ మహాసురుందు నిను విశ్వము బ్రోచితివో పురాణపూ |
రుష! హరి! నీమహాత్మ్య మెవరుంగననేరు వేంకటేశ్వరా ॥ ౨౨

ఉ॥ టక్కులమారివీవు! నిను డాయగ గోరెను భక్తకోటి నిం |
జక్కులబెట్టి ప్రీతిబడవు శ్రీసతి వారినిజూడ నీవు నీ |
చక్కని లీలలివ్వియె చాలును నమ్మిన వారికైననో |
నిక్కపు సామి యేలయిటు నిర్దయ జూపగ వేంకటేశ్వరా ॥ ౨౩

ఉ॥ డంబము కామక్రోధముల డాయగనీక యడంచి మించు మో |
దంబున లోకరాగముల దర్పము నాపి యహింస సత్యధ |
ర్మంబుల బూని యోగమున మానస చంచలనంబు నాపి ధ్యా |
నంబున మౌని నిన్నుగను నాకది సాధ్యమె వేంకటేశ్వరా ॥ ౨౪

ఉ॥ ఢక్కలభేరిరావముల డండమవాద్యములందు నంతటన్ ।
జక్కని వేణువీణలను సర్వసజీవులసుస్వరంబులన్ ।
చెక్కలయందు రాళులను జిత్రవిజీవులయందుగూడనీ ।
యొక్కపవిత్రసత్ప్రణవ ఓంకృతి వెల్వడు వేంకటేశ్వరా॥ ౨౪

చ॥ తనువుననంటివచ్చు పరితాపముపూర్వకృతాఘపుణ్యముల్ ; ।
జననమకామ్యమౌ; పరవశత్వమునన్ నినుగొల్చుచుంటచే ।
తనుదగజన్మముంగడపు ధర్మమెధర్మము గాననిత్యమున్ ।
నినుదగసంస్మరించుమదినిందయచేయుము వేంకటేశ్వరా॥ ౨౫

చ॥ ధనములగల్గినన్ వరలుధర్మము; సౌఖ్యము; దానిలేమిచే ।
తనుగలుగున్ విశేషపరితాపముమాన భయంబుకష్టముల్ ।
గనుక మహాత్మునన్నధికమ్ముగప్రీతినిజూచి యోగ్యమౌ ।
ధనమునొసంగిప్రోవగదె ధర్మపరా!హరీ! వేంకటేశ్వరా॥ ౨౬

ఉ॥ దారుణదుఃఖముల్ కలుగ తత్పరతన్ నినగొల్చు భావమే ।
పారగసర్వసాక్షివగు నాశ్రయునిన్నదలంపనేకో ।
కోరదుబుద్ధి, సౌఖ్యములుకూడగమిన్నను జూచుమానసం ।
బారయునిన్నగొల్చుటదిఅబ్బుటయెన్నడొ వేంకటేశ్వరా॥ ౨౭

చ॥ నలువకుశూలికిన్ సురగణంబులకున్ తవపాదదాస్యముం ।
గబుగుటకష్టసాధ్యమగు, కర్మవశంబునజన్మమెత్తి భూ ।
తలమునగన్ననాకు నిరతమ్మునుతత్సుఖభాగ్యమబ్బునే ।
తలచెదతత్సుఖాప్తిపరతన్ నిను నెమ్మది వేంకటేశ్వరా॥ ౨౮

చ॥ త్రిభువవు, సర్వలోకపరిపాలనకర్తవు, లోక పాలకుల్ ।
ప్రభువులెనీదుముందట, ప్రపంచములెల్లను సర్వభూతముల్ ।
త్రిభువననాథనీదునియతిన్ జవదాటగనేర్చునే! యహాహా ।
అభవ, మహాత్మ, నిన్నుగని అన్యులగొల్తునె వేంకటేశ్వరా ॥ ౩౦

చ॥ ఫలితముగోరుచేత పొరపాటగు, సంకటమూలమౌ, మహా ।
త్ములు ఫలితంబుగోరక విభూతికినై పరమేశ్వరార్పణం ।
బులుగనొనర్తురి కార్యములు, మూఢునకీగుణమెట్లు కల్గుచే ।
తెలుసకలంబునీవెయని ధన్యలెబూనెద వేంకటేశ్వరా ॥ ౩౧

చ॥ బలముశరీరమున్ విడచిపారకమున్నె తవాంఘ్రిభక్తిసం ।
కలితముగానొనర్పగ దెమానసమున్ తివదాస్యసౌఖ్యమే ।
సిలుకడమైనసౌఖ్యమిల, నిత్యముగాదితరంబు గానసిన్ ।
గొలచెదతత్సుఖాప్తికనఘున్ కరుణామయ వేంకటేశ్వరా ॥ ౩౨

ఉ॥ భాగ్యము దేవనీవు మము పాలనజేయుట కుంట; లౌక్య స ।
ద్భాగ్యములిచ్చిక్షేమసుఖముల్ దయచేయుము మాకు, సంతతా ।
రోగ్యమునిచ్చి కావుము నిరోగులుగాగనొనర్చి సత్య సౌ ।
భాగ్యముగూర్పుమీశ్వర! యభాగ్యతమాసిపి వేంకటేశ్వరా ॥

ఉ॥ మానసమందునిన్ననుపమంబగు భక్తినిగొల్చుచుండియే ।
తానమునందు నెప్పుడును దప్పక నిన్మదిదల్చుచుండినన్ ।
నీనియమంబుగా! అచటనిత్యమునుండుట నెన్నభక్తి నిప్డు స ।
న్మానముచేయుదీవు కరుణామయ శ్రీమయ వేంకటేశ్వరా ॥ ౩౪

ఉ॥ యోగముకంటె, దుర్మదవియోగముకంటె, సమస్తయోగి సం|
యోగముకంటె, ధర్మకరయోగముకంటెను, సత్యవాఙ్మహో |
యోగముకంటె, దుష్టహరయోగముకంటెను, మంత్రతంత్రిసం|
యోగముకంటె, నీకుప్రియయోగముభక్తియె వేంకటేశ్వరా॥

చ॥ రతనమునందు ప్రీతియొకరాజుకు, ధర్మమునందుప్రీతియు |
న్నతమతికిన్, దయాదిసుగుణంబులప్రీతియొక ప్రధానికిన్ |
నితరము నెంచకుండ మది నెప్పుడు నిన్నుభజించుభక్తియే |
సతతమునీకుప్రీతిబుధసన్నుతశాశ్వత వేంకటేశ్వరా ॥ ౩౫

ఉ॥ లావునుజూచియుబ్బి మకరంబు ముఖంబునజిక్కి బల్మిమై |
యేవిషయంబుదల్పక జిగీషనుదుర్మదబుద్ధిబోరుచున్ |
లావుతొలంగి తానసువులన్ నిలుపంగను లేని వేళదం |
తావళరాజు నిన్నుమదిగాంచగనయ్యెను నీశరణ్యసం|
భావనమే నిరంతర శుభప్రదమంత్రము వేంకటేశ్వరా ॥ ౩౬

ఉ॥ వేంకటపర్వతాగ్రమున విశ్వసురార్చిత దివ్యమూర్తివై |
సంకటహారివై పరమశాంతుడవై బుధసేవ్యమూర్తివై |
శంకరమూర్తివై కలివశంబున నీగెడుభక్తకోటి ని |
ర్వ్యాకులజేతులొగ్గి నిజవర్గముజేర్చెదు వేంకటేశ్వరా ॥ ౩౭

ఉ॥ శారదయంచు, గౌరియని శంకరుడంచు, కుమారుడంచు, కం|
సారియటంచు, నింద్రుడని, యగ్నియటంచును పేర్లుపెట్టి ల |
క్ష్మీరమణాధరిత్రిని నెమేటిగ గొల్చుచు వారలెల్ల వే |
ర్వేరనకొట్టుకొందురవివేకత, మూఢత, వేంకటేశ్వరా ॥ ౩౮

ఉ॥ సాగరకన్యకాపతి యశాశ్వతమైన జడంబు దేహమౌ ।
రోగసహస్ర లక్షితము, రూపము నుగ్రమావదూపతం।
బాగడ, దుఃఖకారణము నాత్మ నుయుంబు, తదార్చనంబుచే।
నాగగ సార్థకంబగును జన్మము శ్రీవర వేంకటేశ్వరా ॥ ౩౯

చ. హరియను నక్షరద్వయము ఖండ ప్రభావము యంబు, నందున।
క్షరసన్నిధమంబుచే దొలగగ గ్రోడు పాపమునంతయు నా; చూ ।
డరియున నక్షరంబు కడడాగున ఘోరపిశాచబాధలో ।
హా! హరినామసజ్జపమహాత్మ్యము చెన్నద వేంకటేశ్వరా॥౪౦

ప్రాతః ప్రణామము.

చ॥ ఇనుడుదయింప బోయెడిని ఈశ్వర త్వన్మహిమా విశేషముల్ ।
కనులకు జూపి చాటుటకు, గల్మషవృత్తులంబు ద్రోలి నా ।
మనమున భక్తి భావనలు మంగళ నామజపంబు గొల్పగా ।
వన! కొనుమిరాశ నాయుదయపర్వ ప్రణామము వేంకటేశ్వరా॥

చ॥ కనుగొనజేతగాదు జనకా, నిను, సర్వము నుండువాడు, నే ।
విని, మదిగొల్చువాడ ప్రభవించిన భక్తి యనంతమయ్యె, నా।
మనమున నిల్చియుండుము, సుమంగళ గోచ్చదనయ్య! సుపా।
వన! కొనమిరాశ నాయుదయపర్వ ప్రణామము వేంకటేశ్వరా॥

చ॥ నినుగని కొల్వ దేవతలు నీపదసన్నిధి జేరియుండి, త్వ ।
ద్గుణగణకీర్తనమ్మున నతుల్ మాయలు సల్పుచుండ, నా ।

మనవిపినంగసాధ్యమె, రమావర, నీకృపగోచుచుండుఁ, బా।
వనకొనమిూశ నాయుదయపర్వ ప్రణామము వేంకటేశ్వరా॥

చ॥ మనముచలించుచుండె; సుగమంబగు మార్గముగానరాదు మ।
జ్జనక, నిఁపుచూచుటకు; చక్కని నీచరితంబులెన్నెదన్ ।
మనమునగోచరించినను మాధవధన్యునిజేయువయ్య, పా ।
వనకొనమిూశ నాయుదయపర్వప్రణామము వేంకటేశ్వరా॥

చ॥ గుణములు పూర్వకర్మములకూర్పున నేర్పడి లోకవర్తులన్ ।
జనుచు మహాఘబీజములజాలగ పెంపొనరించుచుండె, నా ।
ధనమునసద్గతింగనెడు దారియెరుంగను. నీవెరుక్క, పా ।
వనకొనమిూశ నాయుదయపర్వ ప్రణామము వేంకటేశ్వరా॥

## ప్రార్థన.

ఉ॥ ఎవ్వనిపాదపద్మరజమింతిగరాతిని జేసిమించెనో ।
ఎవ్వనిపాదపద్మములనేర్పడి గంగపునీతయయ్యెనో ।
ఎవ్వనినామసంస్మరణ మెప్పుడు నిష్టఫలార్థినిచ్చునో ।
ఎవ్వనిసత్ప్రభావముల నెన్నగసృష్టిచెలంగుచుండునో ।
అవ్వనతుండవాది పరమాత్ముడవీవయె వేంకటేశ్వరా॥ ౧౮

ఉ॥ కారణమిూవెసృష్టికి జగత్పరిపాలక దేవదేవ నీ ।
భూరియశఃప్రకాశమును పుణ్యచరిత్రమునర్కచంద్రముల్ ।

ధారుణిజాటుచుండరుగదా అనిశమ్మును నద్వితీయుదే ।
వా! రమియించు నాహృదయపంకజమందున వేంకటేశ్వరా॥ ౪౦

ఉ॥ నేనన నెంత ఈశ్వర! గణింపగ నాదగు జన్మమెంతనా ।
పైన భవత్కృపాకిరణపాతము దప్పిన నాబలంబు, నా ।
జ్ఞానము, నాదు నేర్పరితనంబును సర్వము తెల్లమౌను నీ ।
వే నను నాడజేయుదు మహా పరమేశ్వర యెంతవాడ, నా ।
మేనొక కీలుబొమ్మయసుమీ అని యెంచెద వేంకటేశ్వరా॥

ఉ॥ మేనొక కీలుబొమ్మ, నియమించి చలింపగ జేయువాడు శ్రీ ।
జాని, శరీరపుత్రసఖసంఘము రజ్జువులీ ప్రపంచ సం ।
స్థానము నాటకస్థలి, నిజంబుగ కీళుల నాడజేయు నా ॥
ప్రాణము నీదు సృష్టియని భావన జేసెద వేంకటేశ్వరా॥ ౪౨

ఉ॥ తల్లివి నీవె తండ్రివియు దైవమవీవె త్రిలోకపాలకా ।
చెల్లు ని యూయు పేక్షసిన జేరితి నీ శరణంబె కోరెదా ।
ఉల్లమునందు నేమరియు నొల్లను నన్యుని నమ్మికొంటినా ।
కెల్లయు నీవెనమ్మెదను నెప్పుడు నిర్మది వేంకటేశ్వరా ॥ ౪౩

చ॥ గతిదగ నీవె యుంచుజనకా! మదినమ్మితి, లోకమందు నే ।
నితరుని వేడబోనుగద ఏమిటికిన్ కరుణాసముద్రనా ॥
పతిగతి నీవెయందు నను పాలనమొంచిన నీటముంచినన్ ।
క్షితితనయాధినాథ! దయచేయవె నీకృప వేంకటేశ్వరా ॥ ౪౪

చ॥ తనువుజడంబు, మర్కటవిధమ్మనచిత్తము సంచలించు, దా
నినిదగునట్లు నిశ్చలతనిల్పివిధించుట దుర్ఘటంబు, కా
వునహరి! నీపదాబ్జములపొందునుగల్గి సుఖించుచుంటినో
యనిమదిచింతతోఁ జెడితిని ఆశ్రితవత్సల వేంకటేశ్వరా ॥ ౫౨

ఉ॥ సారమొకింతలేకబహుసంకటదాయకమై చెలంగు సం
సారమహాతటాకమున జాలనశక్తుడనై చరించుచున్
దారసుతాదికంటక పథంబున కాలుకదల్పలేకనిన్
గోరితిజేదుకోఁగదవె కూరిమినన్గని వేంకటేశ్వరా ॥ ౫౩

ఉ॥ ఏకరణింగృపంగనెదొ! యీశ్వర! నేనతిదుష్టబుద్ధి,దో
షాకరుడన్, జడుండను, మదాంధుడ, ఘాతకుండ దు
ర్వ్యాకులచిత్తుడన్ విషయవంచితుడన్, బరలోకదూరుడన్,
జేకొనినాకునెట్లు దయచేయుదువో కృప వేంకటేశ్వరా॥ ౫౪

చ॥ కలిమియొకింతయుండనినుగానగ గోరరు, కష్టముల్
బలముగనంట నిన్దలచి బాముల కెల్లను గారణంబు నీ
వలననెకల్గెనంద్రసుఖవారధినీపద భక్తినేమిటన్
దలపగబోవరైహిక మదమ్మునలోకులు వేంకటేశ్వరా ॥ ౫౫

ఉ॥ ఐహికసౌఖ్యముల్ గలిగినంతనెమూలమునేనెయంటి దు
ర్మోహమునందుజిక్కికొని మూలమునీవనియెంచకుంటిరిన్
దాహముతోడ కష్టములుదార్కొన గారణమీవెయంటి శే
షాహిశయాన మూఢుని దయంగనిబ్రోవుము వేంకటేశ్వరా ॥

చ॥ కలుములు లేములుం గలుగు కర్మఫలమ్ములచేత నమురీ ।
పలుకుల నాదరింపుముల పాపము పుణ్యమునీకు నర్పణం ।
బులుగ నోనర్ప నన్నిటికి పూర్వపు కర్మలవెట్లు కారణం ।
బులగును నంతనీకృప యెఘాతిదయాపర వేంకటేశ్వరా ॥ ౪౮

చ॥ జనక ధరిత్రిసిన్ననని శమ్మున నమ్మిమనీసు సేవనో ।
అనయము జేయుచుంటిను మనోత్మ్మలకంటకు సంస్కృతప్రభో ।
వనజములైన తామరలు భానుకరమ్ముల దాకి నీటిలో ।
ననికి నివిక్షి తేలవె, మహాత్మ్ముసత్ప్రభు వేంకటేశ్వరా ॥ ౪౯

ఉ॥ ఘోరమహార్ణవంబు, నతిఘోరతరంగప్రకంపితంబు సం ।
సారమహాబ్ధింబడి ప్రశాంతిని గానక కొట్టుకొంచు, వి ।
స్తారవిషాగ్నిభూత తిమిసంఘుపు కంప్రములందుజిక్కి వే ।
సారయుసృక్కి వేడెదను సౌఖ్యమొసంగగ వేంకటేశ్వరా॥

ఉ॥ మంకుడనై చునీ యెడ నమంగళకార్యములెన్నొ చేసి గో ।
విందమహాపరాధి నపవిత్రుడనైతిని దప్పద్రోచి నా ।
యందు గృపం గొనంగదె మహాత్మ! దయాంబుధి నీవు కాన! ఆ ।
నందరసాంబుధే త్రిభువనప్రభు శ్రీహరి వేంకటేశ్వరా॥ ౫౦

చ॥ కడుపున నుండు బిడ్డ తనకాలను దన్నినటంచు తల్లియా ।
బుడుతను ద్రోసిపుచ్చునె, ప్రభూహరి సర్వజనైకమాత, నే ।
గడు నపవిత్రుడ న్గలుషకర్ముడ, దేవ, మహాపరాధి, దీ ।
నుడ, శరణాగతుండను ఘనంగృపజూడుము వేంకటేశ్వరా॥

చ॥ శరణని కాళ్లపై బడిన శత్రువుకీవభయ ప్రదానముం ।
కరుణనొసంగితెంచు నిజగాథలవిందు, దయాసముద్ర! నేఁ
నరినిలగాను నీదుచరణాంబుజదాసుడ, దివ్యనామసం ।
స్మరణరతుండ, దీనుడనుమందుడఁ, బాపుడ, వేంకటేశ్వరా॥

ఉ॥ పేరులవెన్నొ పెట్టి, పృథివిం బలురూపములిచ్చి నిస్తులా ।
పారగుణమ్ములం దొడిగి భక్తిని నెవ్విధిబూజచేసినం ।
శ్రీరమణీపతీ, తలపసిగ్గగు, నన్నియు నిచ్చెదేరు, నా ।
కోరిక లెల్లనీకెరుక, కోర్కులదీర్తువె, వేంకటేశ్వరా ॥ ౬౩

చ॥ ఒకతరికామమెక్కుడగు, నొక్కతిరిం భవదీయపాద భ ।
క్తికలుగ కామినీవిషయదివ్యసుఖంబుల వాంఛపైకొనుం ।
వికలతనిచ్చి సంసృతి పవిత్రమనోహరణంబొనర్చు, తా ।
వకపదభక్తితత్పరతవర్ధిలు టెన్నడొ వేంకటేశ్వరా ॥ ౬౪

చ॥ జననము మృత్యువుం దనకు సారెమొసంగగబట్టి మృత్యుమై ।
అనయ మహాఘమూలములనట్టి యచంచలసుస్థిరత్వమున్ ।
గాని విషయప్రసూనముల క్రోధఫలంబులనిచ్చు సంసృతిం ।
గనకిటులెక్కికూలితిని, గావవెనం గృప వేంకటేశ్వరా ॥

ఉ॥ నీపదదివ్యపద్మముల నెమ్మది నెప్పుడు గొల్చువాడ, ల ।
క్ష్మీశపతీనీమహాత్మ్యముల చిత్రములెప్పుడు నెన్నువాడ, నే ।
ప్రాపును లేనివాడ, నినుభక్తిస్మరించుచునుండువాడ, దే ।
వాపరిపూర్ణసత్కృపనుపాలనజేయవె వేంకటేశ్వరా ౬౬

చ॥ అతిశయభక్తినీకిటు హోహోరులొనర్చియు వేడుచుండినన్ ।
గతిమఱివేరుగాన హరికావుమటంచును మ్రొక్కుచుండినన్ ।
మతినిటు త్రిప్ప బోవుగద, మాధవ, పూర్వకృతాపరాధముల్ ।
మతినిదలంచెదోకొలువ మానసుమీసిను వేంకటేశ్వరా ॥

ఉ॥ దీనజనైకరక్షకమదిన్ నిజమైనభక్తితోడని ।
న్నే సిరతంబునమ్మిధర నేమియునన్యము నెంచకుండినన్
నీనిజభక్తవత్సలత, నిత్యమురక్షణభారమూసిడే ।
వాసిరతెంబు బ్రోతుగద ఆశ్రితవత్స వేంకటేశ్వరా ॥ ౬౯

చ॥ నినుమదినమ్మినందులకు నేనుదరించితి కష్టసాగర ।
మ్మును, మును బక్కసట్టియుతిమూర్ఖపుబల్కులదల్పబోకు, నా ।
మనవివిచిత్తగించి సుగమంబగు మార్గము జూపుముక్తికిన్ ।
మనమునుసంస్కరించి ఋషిమండల సంస్థిత వేంకటేశ్వరా ॥

చ॥ తెలియగజాలసిన్నిల, మదిన్ గొలువన్ స్థిరచిత్తమెప్పుడున్ ।
గలుగదు, కల్గినన్ ఎదనగర్వమురాగములన్ని పైకొనన్ ।
సిలువదుబుద్ధి నీపయిననిత్యసుఖానుభవాభిలాషినై ।
కలుగునెనాపయింగరుణకాపింతిదాయక వేంకటేశ్వరా ॥ ౭౧

చ॥ తనువిదిమానుషంబు, నిరంతరంబును కామమువోహలోభముల్ ।
మనముజలింపచేసి సుగమంబగు సిపదభక్తి నిత్యపా ।
వనహరినామసంస్మరణ భాగ్యమలభ్యముగానొసర్చు, భా ।
వనలను జేతలందలచి వంచనచేయకు వేంకటేశ్వరా ॥ ౭

ఉ॥ పాపినిగాననాపయిన భావముగల్గదునీకు, నెంతదు।
ప్పాపినొ, దేవ, పూర్వకృతపాపములెల్లనదల్పబోకు. నీ।
ప్రాపునుగోరి మ్రొక్కెదను, భారమునీపయినుంచి వేడెదన్।
నాపయికిన్కబూనకు మనమ్మున శ్రీవర వేంకటేశ్వరా॥ 22

చ॥ భువిని జనించినందులకు, భూరిసుఖమ్ములనున్నగాదె యీ।
భవనిధిదాటగల్గుట, యభాగ్యమునిర్ధనపీడలిట్లు సం।
భవములుగాగనేవిధి శుభంబు సుఖంబులుగల్గు శ్రీహరీ।
తవపదభక్తి తత్పరతదాల్చియు జింతలమాపి యుండెదన్।
భువనచతుర్దశేశ! ననుమోహమునిబ్రోవుము వేంకటేశ్వరా॥ 23

ఉ॥ చేసితిపాతకమ్ముల విశేషముగా, దయజూపదోమనే।
వేసరియుంటినయ్య, పృథివిన్ వసియించి యనంతకర్మముల్।
జెసియనేకకష్టములచే గడుదీనతగాంచి, ఇంక, దే।
వాసదయుండవైనను నవంచితు జేయుము వేంకటేశ్వరా 24

చ॥ విసుగుజనించుకోర్కెలను జేర్కొనివానినొసంగవేడ, మా।
నసగతభావవేద్య, నినునమ్మిభజించెద, జెప్పగోర్కెలన్।
విసిగితి, వేడివేడి, విను వేడుకదొక్కటె, ప్రేమబూని నా।
వ్యసనములన్ని మాన్పినను బావనుజేయుము వేంకటేశ్వరా॥

సా యం ప్ర ణా మ ము.

చ॥ ఇనుడపరాబ్ధిలోనొరిగె, నెల్లెడజీకటు లావరించె, జీ।
వనముల కెల్లపాట్లుపడి పక్షులు, జంతువు, సర్వజీవులున్।

మనములశాంతిఁబూని తమమాటులఁజేరెను, సర్వలోక ర |
క్షణ భరమూని సర్వమునుగాంచుచు దోచెదు నిత్యభక్తభా |
వనకొనుమీశ యస్తమయపర్వప్రణామము వేంకటేశ్వరా॥

చ॥ దినమునఁగూటికై మసలి, తీరనిచింతలఁగ్రుంగి, కష్టముల్ |
గాని యనృతంబులాడి యనఘున్నినుఁదల్పక పాపసంచితం |
బునుదగఁబెంపుచేసియు ప్రభూ! అపరాధిని నైతిఁ బాపునిన్ |
గని క్షమియింప వేఁడెదనఖండకృపన్, బరమేశ, సర్వపా |
వనకొనుమీశయస్తమయ పర్వప్రణామము వేంకటేశ్వరా॥

చ॥ ధనవిధులిచ్చినన్ గొనను, దన్పతఁగోటలఁగోరఁబోను, ది |
వ్యనగరులన్ వరింపను, మహాత్మ, నిజమ్మగుభక్తిదేనిఁగో |
రిన నొసఁగన్ సమర్థుడవు, రిత్తవుగావు మహేశ నేనుఁగో |
రునదిల నీకృపాధనమె, క్రూరమహాఘనివారణంబె, పా |
వనకొనుమీశయస్తమయపర్వప్రణామము వేంకటేశ్వరా॥

చ॥ వినక్షమతోడ నాదుపరివేదన నెల్లను త్వత్పదాబ్జ బం |
ధనముగనుంచి, తిప్పలటునన్నలయించెను పాపసంచితం |
బును, మదినెన్నిదుఃఖభరమున్ భరియింపగలేక మ్రొక్కెదన్ |
ననుదరిఁజేర్చుభారము సనాతననీయదె, భక్తలోక పా |
వనకొనుమీశ యస్తమయపర్వ ప్రణామము వేంకటేశ్వరా॥

చ॥ దినమణియస్తమింపఁగ, మరిన్ దగనీపదసన్నిధాన ముం |
దున నిలుపంగఁజెల్లు, నెడఁదోఁచెను చింతలఁబారద్రోలి సా |

ధనమునసీదు నామమునుదత్పరతన్ భజియించుబుద్ధి నా ।
కొనరగజేయ వేదయ, ప్రభూత్తమ, నిర్గుణ నిత్యభక్త భా ।
వనకొనుమీశ యస్తమయుపర్వప్రణామము వేంకటేశ్వరా॥

## మా న సి క పూ జ.

చ॥ పరమపవిత్ర, సిస్తులప్రభాకర, దీనజనైకబంధు శ్రీ ।
వర, పరమాత్మ, దేవ, అభవా, హరి, శౌరి,మహేశ్వర,ప్రభో।
శరణని నీదుపాదములసన్నిధిజేరి నమస్కరించి హృ ।
త్సరసిజసింహపీఠినిను జక్కగజేర్చితి వేంకటేశ్వరా ॥ ౮౧

ఉ॥ వందనమిందిరారమణ, వందనమార్తజనైకరక్షణా ।
నంద, జగత్ప్రభూసుకరుణామయ, ధీమయ, దేవరాయ, గో।
వింద, మహానుభావ, తనివింగనిరీక్షమది, దివ్యదర్శనా ।
నందరసాశ్రుధారలఁగొనంగదెపాద్యము వేంకటేశ్వరా॥ ౮౨

చ॥ పరమపవిత్రత్వచ్చరిత పావనతన్ మదినెంతు విన్ననే ।
మరలవినంగఁగోరైయగు,మాధవ,త్వన్మహిమాద్భుతంబులన్ ।
మరిమరి సన్నుతించెద, నమానషకార్యములన్ స్మరింతు శ్రీ।
హరి తెనకీర్తికీర్తన కృతార్ఘ్యముగైకొను వేంకటేశ్వరా॥

చ॥ పరుడనుగాను త్వచ్చరణ భక్తజనాశ్రితుడన్ మహాప్రభూ।
పరమదయానముద్ర, తవపాదసరోరుహాభక్తిజాత ది ।
వ్యరససుమాధురీరతుడనాశ్రితుడన్ ప్రణతుండ దేవశ్రీ ।
హరికొనుభక్తి భావనరసాచమనంబును వేంకటేశ్వరా॥ ౮౪

చ॥ నినుగనినీదునామజప నిశ్చలతన్ దృఢచిత్తలక్ష్యమున్ ।
గాని హృదయంబుపొంగజనకున్నను నెమ్మదిభక్తిగాల్వ నా।
మనముదలంపకున్నయగు, మాధవ, భావతరంగజాతకం ।
పన విధదృశ్యమాన మధుపర్కములంగొను వేంకటేశ్వరా ॥

చ॥ పరమసుధారసంబుతవ పావననామజపానుభూత భా ।
సురనిజమాన సానుభవసూత్మసుఖం, బభవా, జగత్త్రియే।
శ్వర, హరి, తన్మయత్వమున వర్ధిలుదివ్యసుఖానురూప ది ।
వ్యరసమునందు స్నానమును నర్పణజేసెద వేంకటేశ్వరా॥ ౧౬

చ॥ హరి, మదినెన్నజాలుదునె, యద్భుతలీలలఁజిక్కి లోకముల్।
నిరతమునీదుమాయఁగణింపగజాలక వెల్లబోయి, ని ।
న్నెరుగక మోసపోయెడిని, ఈశ్వర, త్వన్మహిమానుసన్న నా।
స్ఫురితసుఖానురూప పరిశుభ్రదుకూలములన్ ధరించి సు ।
స్థిరముగనాదుహృత్కమల సీమవసింపుము వేంకటేశ్వరా॥

చ॥ నినుసకలైక వేద్యు, ధరణీధవు, మాధవు, లోకబాంధవున్ ।
గానివసియింప జేయగను గోమలహృత్కమలాసనంబు భ।
క్తినినిడిసేవజేసెద, మదీయహృదంబు జసింహపీఠి నిం ।
గాని వసియింపు నిశ్చలత,గూడమినన్గని వేంకటేశ్వరా॥ ౧౮

చ॥ అమితదయామయుండవు, మహాత్ముడ,వాశ్రితవత్సలుండ,వా।
ర్యమశశిలోచనుండవు, నిరాశ్రయనిర్గుణనిర్వికల్ప ని ।
ర్భ్రమపరతత్వమూర్తివి అపారప్రభాస్వతత్వసద్గుణంబులన్।
సుమములజేసి పూజలను శుద్ధిగజేసెద వేంకటేశ్వరా ॥ ౧౯

ఉ॥ ముద్దగు నెమ్మొగమ్మున, బ్రభూ, కడుసొంపుగ నూర్ధ్వపుండ్రముల్ |
దిద్దిశిరోజబంధమున దివ్యసుమంబులగూర్చి భక్తిమై |
ముద్దగుకంఠదేశమున ముత్యసకాంచన హారమాలికల్ |
ఒద్దికనుంచి, వక్షమున నుత్తమ కౌస్తుభదివ్యరత్నముఁ |
దిద్దియు, నాల్గుచేతులను దివ్యసుదర్శన శంఖపద్మముల్ |
పెద్దగదన్ ధరింపగను బెట్టి హిరణ్మయకంకణంబులన్ |
సుద్దిగనుంచి వ్రేళులను శుద్ధమణీకృత భూషణంబులన్ |
ముద్దుగబెట్టి, కాంచినమున్ బిగియింపగనుంచి, యంఘ్రులన్ |
సుద్దిగగంగతో గడిగి, సొంపగు భూషణముల్ దగిల్చి, నీ |
ఇద్దశరీరమంతటను బ్రీతిసుగంధముబూసి; దేవ, నీ |
ముద్దగురూపముఁ మనసుపొంగగ జూచెద వేంకటేశ్వరా॥ ౯౦

ఉ॥ శ్రీరమణీశ, శాశ్వత, విశేషకృపాపరిపూర్ణమూర్తి, నీ |
భూరిగుణంబులన్ దలచి పుణ్యచరిత్రములన్ వెలుంగు వి |
స్తారప్రభావచిత్రముల జాలగ సెన్నుచు, భక్తితోడవై |
త్యారసహస్రనామముల నర్చనజేసెద వేంకటేశ్వరా ॥ ౯౧

ఉ॥ పాపహారంబు శాశ్వత శుభప్రదశక్తిమయంబులోక సం |
తాపహారంబు మంగళ ప్రదంబగు నీదుచరిత్ర, భక్త స |
ల్లాపపదంబు తజ్జనితరమ్య సుగంధ సమీరమచ్యుతా |
ధూపము భక్తిపూత కరధూపమునుంగొను వేంకటేశ్వరా ॥

ఉ॥ శ్రీతరుణీమణీశ్వర విశేషప్రభాపరిపూర్ణ సత్ప్రభూ |
నీతను దివ్యతేజముగణింపగ శక్యమె, దాని సెన్నగా |

నాతరషణా ని, కోటిదిననాథ ప్రదీప్తినిమించు సత్వరం ।
జ్యోతిని నిత్యభక్తిమయ జ్యోతిసుదీప మనుగ్రహింపు దు।
ష్పాతక నాశ కాచ్యుత ప్రసన్నము ఖాంబుజ వేంకటేశ్వరా॥

ఉ॥ సాగరకన్యకావర, విశాలకృపాపరిపూర్ణ కేశవా ।
భోగివిభవ్యభక్తిరస భోక్తవుసర్వమయుండ విశ్వరా ।
నేగణి యింపజాలుదు ని నీదగు భక్తపరత్వదీక్ష న ।
ర్వాగమవేద్యసర్వ భుగనంత ప్రభామయా, సర్వనాయకా।
భోగిశయానభక్తిరస భోజనముంగొను వేంకటేశ్వరా ॥ ౯౮

చ॥ విమలయశోవిశాల పృథివీతన యాపతినన్నుగొల్చు భా ।
గ్యముసుకృత ప్రయోజనము గణ్యశుభోదయకారణమ్ముగా।
ద్విమల పదాశ్రయాస్ఫురిత దివ్యసుఖానుభవాను రూప ।
సంభ్రమకృత సద్రసాచమన పానముగైకొను వేంకటేశ్వరా॥

చ॥ పరమపవిత్ర మద్హృదయపద్మమునన్ తవదవ్య తేజముల్ ।
తిరముగనిల్పి చూడగను చిత్తమునంజనియించు భావనల్ ।
సురుచిరమైన పోకలుగ శుద్ధమహామహిమాను వర్ణనల్ ।
వరసను నాగవల్లి దళజాలముగా తములంబు దేవ శ్రీ ।
హరి తవపాద సన్నిధిని నర్పణజేసెద వేంకటేశ్వరా ॥ ౯౬

ఉ॥ తేజముభూనభోంతర ప్రవేశము నెల్లెడదుర్నిరీక్ష్యమై ।
రాజిలగన్ భవన్నిజవి గాత్ర్విభురూపము గోచరించె, న।
వ్యాజవిలీనమానససుఖానుభవాత్మికమై వెలుంగు నీ ।
రాజనమిచ్చువాడ గాను రాజమహేశ్వర వేంకటేశ్వరా॥ ౯౭

ఉ॥ మంగళమాదిదేవహరి మంగళమీశ్వర సర్వపావనా ।
మంగళమిందిరాహృదయ మంగళమచ్యుత మాధవస్వభూ।
మంగళమద్వితీయా, సురమాన్య, మహేశ్వర, సర్వభూవరా।
మంగళమెల్ల వేళలను మంగళమవ్యయ వేంకటేశ్వరా ॥ ౯౮

ఉ॥ శ్రీరమణీమనోహర హరీ శ్రీజగన్నుత సత్ప్రభూ నిరా ।
కారనిరాశ్రయా, ప్రకృతికారణ నిర్గుణ, నిర్వికార, ని ।
ర్వైర, నిరీశ్వరాచ్యుత, శుభస్కర మదీహృదయాంతరస్థ స।
న్నీరజమంత్రపుష్పము మునిస్తుతగైకొను వేంకటేశ్వరా॥ ౯౯

ఉ॥ దేవపరాకు శ్రీశవసుదేవతనూభవకృష్ణసర్వ స ।
ద్భావపరాకు, నిర్గుణ శుభప్రతిపాదన నిత్యభక్తి సం ।
భావపరాకు, చంద్రమప్రభాకరలోచన లోకనాథ, మ।
ద్దేవపరాకు, రామజగతీపతి శ్రీపతి వేంకటేశ్వరా ॥ ౧౦౦

చ॥ శరణుకృపారసాంబునిధి, శాశ్వత, లోకశరణ్య, నిర్మలా ।
శరణుజగత్ప్రభూశరణు సర్వసురేశ్వర, సర్వపావనా ।
శరణు జనార్దనా శరణు శార్ఙ్గగదాబ్జసుదర్శనాంచితా ।
శరణు భవాబ్ధితారక ప్రసన్నముఖాంబుజ వేంకటేశ్వరా॥

చ॥ జయజయ, ఇందిరావర విశాలకృపాకర సర్వభూవరా ।
జయజయ నిష్కళంక, బుధసన్నుత శాశ్వత దేవతావరా।
జయజయ మద్విభోపరమశాంత వివక్షుకృతాంత ఈశ్వరా ।
జయజయ తార్క్ష్యవాహన ప్రసన్నముఖాంబుజ వేంకటేశ్వరా॥

# ఆత్మార్పణము.

చ॥ ప్రభువరనీయనుగ్రహమెభాగ్యము,త్వచ్చరణాశ్రయంబె మ।
ద్విభవము, నామసజ్జపమెదివ్యసుఖంబు, తవార్చనంబె దు ।
ర్లభసుఖకారణంబు తెవరమ్యసుగోష్ఠియె వాంఛితంబు, కా।
స్తుభధరత్వత్సమర్పితుడసుమ్ము మహేశ్వర వేంకటేశ్వరా ॥

ఉ॥ దేవ, తవార్పితుండ, నతిదీనుడ, త్వచ్చరణాశ్రితుండ, ని ।
న్నేవిధిఁజేరగల్గుదునొ యేమి యెఱుంగను, సత్యదూరుడ।
పాపనమూర్తినన్నుగని పావనుజేసియనుగ్రహింపు భ ।
క్తావన, వందనంబు, జనకా, కరుణాకర వేంకటేశ్వరా॥ ౧౧౮

చ॥ శరణనినీదుపాదముల సన్నిధిజేరితి నీవెదిక్కునే ।
నొరులనుజేరబోనుగద, ఓకరుణామయభక్తవత్సలా ।
హరియిక చాలునన్నుగని యాదరభావముఁబూని వెంటనే;
స్థిరమగునీదు తానమున జేర్చుకొనంగదె వేంకటేశ్వరా ॥

చ॥ బ్రతుకునరోతగల్గు, ధనభాగ్యవిహీనతజక్కి, పాపినై ।
అతిశయదుఃఖబాధలననంతముగాగనియుంటజేసి, శ్రీ ।
పతి శరణాగతుండ, నిక పాపము పుణ్యము నీకెయర్పణం।
బతిశయప్రేమ నీదుచరణాశ్రయమీయవె వేంకటేశ్వరా॥

చ॥ హరి, కరుణారసాంబునిధివై వెలుగొందుటనిక్కమేని, శ్రీ।
వర శరణాగతార్తి జనవత్సలసద్బిరుదంబునీకు సు ।
స్థిరమగునేని, భక్తులనుదీనుల బ్రోచెడువాడవేని, నీ ।

చరణములాన, చింతలవశంబున నీల్గెదు నన్నుజూచి, నా।
కౌ అతలదీర్పకున్న నినుగొల్చుట వ్యర్థము వేంకటేశ్వరా ॥

ఉ॥ భోగినగంబుపేరు, తవమూర్తి నిరంతర దర్శనోత్సుకో।
ద్యోగముమత్ప్రియోజనమహో! భువనేశ, యనుగ్రహింపుమా।
నాగశయాన, నిన్ను, నయనమ్ములపండువుగా నిరంతరం।
బేగతిజూడగల్గుదునో, యీశ్వర, శ్రీకర, వేంకటేశ్వరా॥

## ఉ ప సం హా ర ము.

ఉ॥ చెప్పితిబద్యజాలమును శ్రీకమలాపతి, నీస్తవంబుగా।
తప్పులు పెక్కులుండు గవితల్,కవిగాన గదాయె నీపరంబుగా।
నెప్పుడు నెవ్వరేమి వచియించిన నొప్పినదానియందునే।
తప్పునుగల్గకుండునటు లాపసులుల్, సురవర్యులెల్లెడల్।
అప్పుడెచేయదప్పదని యంటివిగాహరి వేంకటేశ్వరా॥౧౦౯

చ॥ భవతరణిప్రదానమున బద్ధసుకంకణదివ్యమూర్తివై।
భువిదిరుపర్వతాగ్రమునబూనికనిల్చి జగత్ప్రసిద్ధవై।
భవములవెల్గుచుండు నిజభక్తపరాశతకానురూపమా।
కవిత తవార్పితంబగునుగాక మహేశ్వర వేంకటేశ్వరా॥౧౧౦

చ॥ నిరతమునీదు పాదముల నిశ్చలభక్తి మదీయమానసాం।
తరమున వెల్గుగాక, తవదాస్యమె నామదినిండుగాక నీ।
చరణములెల్ల వేళలను జక్కగమానస వీధినుండు గో।
చరము యియుండుగాక ఋషిసన్నుత శ్రీహరి వేంకటేశ్వరా॥

శ్రీ వేంకటేశ్వరార్పణమస్తు.

## శ్రీ వేంకటేశ శరణాష్టకం.

శ్రీవేంకటాద్రిశిఖరస్థిత వేంకటేశ।
సర్వేశసర్వబుధసన్నుతసర్వవ్యాపిన్।
యత్పాదరేణు జనదీభువనంపునాతి।
త్వత్పాదపద్మయుగళీ శరణాగతోఽస్మి॥

శ్రీవేంకటాద్రి నగరస్థిత వేంకటేశ।
భక్తానురక్త, భవనాశనభవ్యమూర్తే।
ఆదిత్యకోటి సదృశాతిప్రభాప్రపూర్ణ।
త్వత్పాదపద్మయుగళీ శరణాగతోఽస్మి॥

శ్రీవేంకటాద్రి నిలయాచ్యుత వేంకటేశ।
లోకైక సేవ్యఋషిలోక హృదబ్జవాస।
ఆనందరూపసుప్రసిద్ధప్రభావమూర్తే।
త్వత్పాదపద్మయుగళీ శరణాగతోఽస్మి॥

శ్రీవేంకటాద్రి పరిపాలక వేంకటేశ।
యజ్ఞేశయజ్ఞయజనాత్మకయజ్ఞపాల।
ఇష్టార్థసిద్ధిప్రదనంత కృపావిశాల।
త్వత్పాదపద్మయుగళీ శరణాగతోఽస్మి॥

శ్రీవేంకటాద్రి ఋషిసేవిత వేంకటేశ।
నారాయణావ్యయముకుంద ప్రసన్నరూప

వాగీశ శ్రీశ త్రిపురాంతక సేవ్యమూర్తే ।
త్వత్పాదపద్మయుగళీ శరణాగతోఽస్మి ॥

శ్రీవేంకటాచల విహార ప్రియాఖిలేశ ।
శ్రీవత్సకౌస్తుభధరాచ్యుత సత్ప్రభావ ।
సర్వార్తినాశ, విబుధేశ్వర శ్రీనివాస ।
త్వత్పాదపద్మయుగళీ శరణాగతోఽస్మి ॥

శ్రీవేంకటాద్రి బిలసంస్థిత వేంకటేశ ।
శ్రీనాథ, శ్రీద, సురనాథ, ప్రసిద్ధమూర్తే ।
నాగేంద్రతల్ప విహగేంద్రతురంగరంగ ।
త్వత్పాదపద్మయుగళీ శరణాగతోఽస్మి ॥

శ్రీవేంకటాద్రి పరికల్పిత భవ్యధామ ।
శ్రీరామ, భక్తజనతాపవిరామ, రామ ।
వైకుంఠధామ, భవమోచన దివ్యనామ ।
త్వత్పాదపద్మయుగళీ శరణాగతోఽస్మి ॥

శ్రీ వేంకటేశ్వరార్పణం.

---